ఓమ్

శ్రియై నమః

శ్రీలక్ష్మీవేంకటేశాయ నమః

# శ్రీ దుందుభినామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గము

**1982-83**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాన్తి,

బ్రహ్మశ్రీ, దైవజ్ఞశేఖర, తంగిరాల చిన హనుమత్సిద్ధాంతి గారిచే విరచితము.

(వీరి పుత్రుడు ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతి సహాయ పంచాంగకర్త.)




తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన పణ్డితులు

తర్క-వేదాన్త మహావిద్వాన్, విద్యాభూషణ, ఆగమవిద్యాసార్వభౌమ,

అప్పికట్ల శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యుల వారిచే పరిష్కృతము.

తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్. గారిచే ప్రకటింపఁబడినది.

తిరుపతి

1982

ఓమ్

## శ్రీ వేంకటేశ భగవాన్



ఓమ్॥ మత్పాదౌ శరణం వ్రజేతి చరణౌ సంసార సిన్ధుస్తథా
జానుం సంస్పృశతీతి జానుమపి పాణిభ్యాం స్వయం దర్శయన్।
శేషాద్రౌ జగతోఽస్యరక్షణధియాఽతిష్ఠద్దయా సాగరః
స శ్రేయాంసి చతుర్భుజః కలయతాం శ్రీ శ్రీనివాసః ప్రభుః॥

పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః.
తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన విద్వాన్.

# శ్రీ దుందుభినామ సంవత్సర
# సిద్ధాన్త
# పంచాఙ్గ పత్రికా

పంచాంగ కర్తలు :

దైవజ్ఞశేఖర
శ్రీ తంగిరాల చిన హనుమత్సిద్ధాంతిగారు,
తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి,
(పూర్ణ జ్యోతిషాలయం)
రేలంగి — తణుకు తాలూకా,
పశ్చిమ గోదావరి జిల్లా (ఆంధ్ర.)

ఓమ్

# శ్రీ పద్మావతీదేవి



ఓమ్॥ ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్స్థలనిత్యవాసరసికాం తత్ క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

ఓమ్

శ్రీ ర స్తు

శ్రీలక్ష్మీ వేంకటేశః ప్రసన్నో భవతు

శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

82 to 83

# * పీ ఠి కా ర ం భః *

ఓమ్॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ । విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

శ్రీమాన్ శ్రీశేషపృథ్వీధరశిఖరపరిష్పందిపాదారవింద-
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్వాన్తనస్సంతనోతు ।
లక్ష్మీం లక్ష్మీవియోగాసహనిజహృదయః కోఽపి కారుణ్యపూర్ణో
దేవాధీశః ప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో నః ॥

కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠముదారహారమ్ ।
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్ ॥

మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే ॥

శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందనయోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ॥

విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।
కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్ ॥

ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ।
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః
ధైర్యం రాహుశ్చ కీర్తిం సకలశుభయుతాం కేతురిష్టార్థసిద్ధిమ్ ॥

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ । వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥
శ్రీవేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ । నమస్కృత్య హృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥
సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః । దద్యుర్మనోరథం సర్వం దేవతాః ఫలముత్తమమ్ ॥
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్। చంద్రార్కౌ తత్ర సాక్షిత్వం భజేతే విశ్వలం యతః॥
యథా శిఖామయూరాణాంనాగానాంమణయోయథా। తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్నిసంస్థితమ్

శ్రీవత్స జన్మాఽఖిల సౌరతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిర్హనూమాన్ ।
శ్రీ తంగిరాలాన్వయజోఽహమార్యాః శ్రీ శేషశైలేశ కృపావిశేషః ॥

సోఽహం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్ ।
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు ॥

# గురువందనమ్

దైవజ్ఞ ప్రథమస్య పూర్ణయశసశ్శ్రీబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీపిడపర్తివంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ ।
సూర్యార్యాదిపురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్రిస్కంధాంబుధిపారగో మమ గురుః వందే సదాశ్రేయసే ॥

## దైవజ్ఞ ప్రశంసా, దైవజ్ఞ నివాసః

శ్రీ వేంకటేశా వ్యనృసింహహాటకేశాదిదేవైరభిరక్షమాణమ్ ।
గోదావరీ పశ్చిమయోజనాంతర శ్రీగోస్తనీతీరవిరాజమానమ్ ॥

శ్రీ వేదవేదాంగవిదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండితైశ్చ ।
ఈఢ్యైర్వదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్ ॥

యద్వంశే బహవశ్శ్రుతిస్మృతివిదో సజ్జ్యోతిషే పండితాః
శ్రీవత్సాభిధగోత్రజాస్తదనుమత్పైతామహోఽత్యంతధీః ।
శ్రీమత్పండితసార్వభౌమహనుమాన్వేదార్థవిత్సాత్త్విక-
స్తత్తత్కర్మసుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా ॥

తస్యాత్మజో వేంకటకృష్ణసోమయాజీసుసిద్ధాంతవిదగ్రగణ్యః ।
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ ॥

జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వితీయాకస్తు పూర్ణదైవజ్ఞః ।
తార్తీయోఽహం హనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః ॥

అనార్యం చ్యవనోంగిఽరోఽత్రిముఖరావత్యర్చమాన్యా-
స్మనీనాచార్యానవరామ్నయా హనుమతా శ్రీతాతపాదం గురుమ్ ।
పంచాంగం విరచయ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
నశ్శ్రేయాంసి దయామయః కలయతాం శ్రీ వేంకటేశః ప్రభుః ॥

**తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి**

## అథ బ్రహ్మణః ఆయుఃప్రమాణాదికం

శ్రీమద్భగవద్దివ్యనాభీకమలజాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుర్వర్షశతమేవ । తత్ప్రమాణసౌరాబ్దాః 31104000 కోట్లయః । వర్తమాన బ్రహ్మణః పరాఖ్యస్యాయుషః అర్థంగతం । ద్వితీయపరార్థే ప్రథమవాసరే గతఘట్యాదయః । ఘ॥ 17 విఘ॥ 42 ప్రాణకాల(ం)గుర్వక్షరోచ్చారకాలః 3 నిమేష 19 లవ 18 త్రుటయః 94 సంప్రతి 95 త్రుటౌగత సౌరమాసాదయః 2,7,20,0. బ్రహ్మణః సౌరమానేన వయోగతవత్సరాః 1,55,52,195,83 వత్సరాః । ఇదానీం శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః । సప్తమే వైవస్వతమన్వంతరే 27 మహాయుగాని గతాని । మహాయుగ ప్రమాణ సం॥ 4320000, కృతయుగ ప్ర. సం॥ 1728000, త్రేతాయుగ ప్ర. సం॥ 1296000, ద్వాపరయుగ ప్ర. సం॥ 864000, కలియుగ ప్ర. సం॥ 432000, సృష్టికాలాత్ప్రాగ్బ్రహ్మధ్యానగతవత్సరాః 193,58,85,083, కలియుగే గతాబ్దాః 5083, శాలివాహనశకే గతాబ్దాః 1904, విక్రమశకే గతాబ్దాః 2039, ఇంగ్లీషు 1982–1983.

మహాయుగము అనగా 4320000 సంవత్సరముల పరిమాణముగలది. అది కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు అనునామములతో విభాగింపబడి వ్యవహరింపబడుచున్నది. "యుగం భవేత్ వత్సరపంచకేన యుగాని తు ద్వాదశ వర్షషష్ట్యాం" ఇత్యాది శాస్త్రవచనములు. ప్రభవాది షష్ఠిసంవత్సరములలో అయిదు సంవత్సరములు ఒకయుగము. అట్టియుగసంఖ్యచే షష్ఠిసంవత్సరములు (5 × 12=60) 12 యుగములుగానగుచున్నవి అని చెప్పుచున్నవి. అట్లు యుగముగానైన అయిదు సంవత్సరములను గూర్చి కృష్ణయజుర్వేదము (తైత్తిరీయ బ్రాహ్మణము) కాఠకప్రశ్నము నాల్గవ అనువాకమునందు,

"సంవత్సరోఽసి, పరివత్సరోఽసి, ఇదావత్సరోఽసి, ఇదువత్సరోఽసి, ఇద్వత్సరోఽసి" వత్సరోఽసి ॥ ఇతి ॥ ఇట్లు చెప్పుచున్నది.

ఇందులకు విద్యారణ్యభాష్యము,

ప్రభవాదిషు షష్ఠిసంవత్సరేషు ఏకైకస్మింశ్చ క్రమేణ సంవత్సర పరివత్సరాది శబ్దాః వర్తన్తే, ................................................ పంచస్వేతేష్వనుగతాకారః వత్సరః । ఏతద్రూపోఽసి. ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం ॥ ఇతి ॥ అని చెప్పుచున్నది.

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "సంవత్సరము, పరివత్సరము, ఇదావత్సరము ఇదువత్సరము, ఇద్వత్సరము" అను నామములుకలవై యున్నవి. ఇటులనే మిగతా ప్రతి అయిదు సంవత్సరములకు నామములను తెలియదగియున్నది. ఇటుల లెక్కించిన ఈ దుందుభినామసంవత్సరము ప్రభవాదిగా 56 వ సంవత్సరమగుటచే పన్నెండవ యుగములో ప్రథమ వత్సరమగుచున్నది. దీనిని సంవత్సర శబ్దముచే వైదికులు వ్యవహరించుచున్నారు. ఇది అగ్ని దేవతాకమగుచున్నది — సంవత్సరనామముగల ఇద్వత్సరమని పేరుగల ఈ సంవత్సరమున రజితదానము విశేష ఫలదమగును.

దయాసముద్రుడగు శ్రీ వేంకటేశప్రభువు యొక్క అనుగ్రహ పాత్రులగు వారలకు అన్నియు శుభప్రదములుగాను సుఖప్రదములుగాను ఉండునని తలంచవలసియున్నది.

శ్రీ వేంకటేశ్వరాయ నమః

# శ్రీ దుందుభినామ సంవత్సర పంచాఙ్గ పీఠికా

కల్యాద్యబ్దాః ౫౦౮౩, శాలివాహన శకాబ్దాః ౧౯౦౪, విక్రమార్క శకాబ్దాః ౨౦౩౯, శ్రీ శంకరాచార్యాస్వామ్యవతారాబ్దాః ౨౦౫౫, శ్రీ రామానుజస్వామ్యవతారాబ్దాః ౯౬౫, శ్రీమధ్వాచార్యావతారాబ్దాః ౭౬౫, ఫసలీశకాబ్దాః ౧౩౯౧ - ౯౨, హిజరీశకాబ్దాః ౧౪౦౨-౧౪౦౩, ఇంగ్లీషు 1982 - 83, భారతీయస్వతంత్రాబ్దాః ౩౬, ప్రభవాదిగతాబ్దాః 56, ఏష్యాబ్దాః 4.

## సంవత్సర ఫలము

ఈ సంవత్సరమందు సంవత్సరాధిపతి - శుక్రుడు, మంత్రి - బుధుడు, సేనాధిపతి - కుజుడు, మేఘాధిపతి - కుజుడు, సస్యాధిపతి - శని, ధాన్యాధిపతి - గురుడు, అర్ఘాధిపతి - కుజుడు, రసద్రవ్యాధిపతి - చంద్రుడు, నీరసద్రవ్యములగు సువర్ణ రజతాదులకు రత్న, సుగంధవస్తు వస్త్రాదిపతియు శుక్రుడు, వర్షలగ్నాధిపతి సూర్యుడు, జగల్లగ్నాధిపతి - శని. 4 కుంచములు వర్షము, అందు 8 భాగములు సముద్రములందును, 9 భాగములు మెట్ట ప్రదేశములందును, 3 భాగములు భూమియందును వర్షించును. పశుపాలక, గోష్ఠాగార ప్రాపకులు - శ్రీకృష్ణుడు, గోష్ఠ బహిష్కర్త - యముడు. 16 వీసములలో 10 వీసముల పంటలు గల్గును. ధరలు హెచ్చుస్థాయిలో నుండును.

## మౌఢ్య నిర్ణయము

అధిక ఆశ్వయుజ శుద్ధ ౧౪ శని (2-10-1982) మొదలు కార్తీక బ॥ ౭ బుధ (8-12-1982) వరకు శుక్రమౌఢ్యము. నిజ ఆశ్వయుజ శు ౧౪ ఆది (31—10—1982) మొదలు కార్తీక శుద్ధ ౧౦ శుక్ర॥ పర్యంతము గురుమౌఢ్యము.

## కర్తరీ నిర్ణయము

వైశాఖ శు ౧౨ మం॥ (4-5-1982) లగాయతు జ్యేష్ఠ శుద్ధ ౬ శుక్ర॥ (28-5-1982) వరకు కర్తరి.

## పుష్కరనిర్ణయము

కార్తీక శుద్ధ ౧౦ శుక్ర (26—11—1982) న శ్రీ భీమరథీనదీ పుష్కర ప్రారంభమగును.

1982 మార్చి 26 తేదీని చాంద్రమాన దుందుభి సం॥రం ప్రారంభమగును.

14—4—1982 తేదీని సౌర సంవత్సరం ప్రారంభమగును.

22—3—1982 తేదీని 1904 శాలివాహనశకం ప్రారంభమగును.

21—1—1982 తేదీని సావన వర్షారంభమగును.

1—7—1982 తేదీని కాలి శక ప్రారంభమగును.

## కార్తె ప్రవేశములు – వర్షనిర్ణయము

| 1982 | | నక్షత్రము | | | గం. వి. | సారాంశము |
|---|---|---|---|---|---|---|
| మే | 11 | కృత్తిక | మ | గం. | 1–41 | అనావృష్టిః |
| | 25 | రోహిణి | ప. | గం. | 10–47 | అనావృష్టిః |
| జూన్ | 8 | మృగశిర | వ. | గం. | 10–30 | స్వల్పవృష్టిః |
| | 22 | ఆర్ద్ర | ప. | గం. | 11–23 | సువృష్టిః |
| జూలై | 6 | పునర్వసు | మ. | గం. | 12–56 | సువృష్టిః |
| | 20 | పుష్యమి | మ. | గం. | 2–39 | చిత్రవృష్టిః |
| ఆగస్టు | 3 | ఆశ్రేష | మ. | గం. | 3– 7 | చిత్రాల్పవృష్టిః |
| | 17 | మఘ | రా. | గం. | 12–57 | సువృష్టిః |
| | 31 | పుబ్బ | ఉ. | గం. | 10–17 | చిత్రఖండవృష్టిః |
| సెప్టెం | 13 | ఉత్తర | తె. | గం. | 4– 1 | సువృష్టిః |
| | 27 | హస్త | రా. | గం. | 7– 8 | వాయుమిశ్రితవృష్టిః |
| అక్టో | 11 | చిత్ర | ఉ. | గం. | 7–30 | సువృష్టిః |
| | 24 | స్వాతి | సా. | గం. | 5–12 | సువృష్టితుల్యః |
| నవం | 6 | విశాఖ | రా. | గం. | 12–22 | వాయుమిశ్రితవృష్టిః |
| | 19 | అనూరాధ | తె. | గం. | 5–10 | సస్యోచితవృష్టిః |

ఇవి ప్రాయికముగ సరిపడును. మరియు పీఠికలలో వర్షయోగ ఫలములను గమనించవలెను.

## సముదాయ ఫలము

ఈ సంవత్సరమునందు 9 మంది నాయకులలో 5 గురు శుభులు, 32 అధిపత్యములలో 15 ఆధిపత్యములు క్రూరగ్రహములకు సంభవించినవి. వత్సరాదినుండి శ్రావణ శుద్ధ ౨ గురువారం వరకు కాలసర్ప యోగమును, అధిక ఆశ్వయుజ మాసమందు బహుళము 13 దినములు (విశ్వఘస్రపక్షము) గల్గుటచే ఆ కాలమందు సస్యపీడలు, విప్లవములు, రోగోపద్రవములు సంభవించును. రాజు, మంత్రి, ధాన్యాధిపతి, పశుపాలకులు శుభులగుటచే అవన్నియు నివారింపబడి సౌఖ్య ప్రదముగనే యుండును. 4 కుంచములు వర్షములుండుటచే హెచ్చువర్షములు గల్గుటచే వరదలవల్ల అరిష్టములు గల్గును. 16 వీసముల పంటలో 10 వీసములు మాత్రమే ఫలించును. వర్షకాలపు పంటలు, మెట్టభూములు, నల్లవి, ఎర్రని భూములు, సస్యములు హెచ్చుగ ఫలితము నొసంగును. వర్షలగ్న, జగల్లగ్న అధిపతులు రవి శనులై వీరు తండ్రి కుమారులగుటచే రాజకీయవర్గములందు విభేదములు నివారింపబడును. దేశము మొత్తముమీద అధిక పంటలు కల్గును. అన్న సమృద్ధియే కల్గును. ప్రభుత్వమునందు స్థిరత్వము కల్గును. సంవత్సరాది నుండి నిజ ఆశ్వయుజ మాసాంతరమువరకు హెచ్చుధరలువుండి తదాదిధరలు కొద్దిగా మందగించును. బెల్లము, మిర్చి, చింతపండు, పుగాకు, ఫలవృక్షములు విరివిగా ఫలించి వీటికి ధరలు కొద్దిగా హెచ్చు తగ్గులతో నుండును.

మార్గశిర పుష్యమాసములందు ప్రకృతి భీభత్సములు, తుఫానులు సంభవించును. ఆంధ్రదేశము, దక్షిణనైఋతి దేశములందు అతివృష్టి, అనావృష్టిబాధలు కలిగి సస్యములకు మూషక, కీటకాదిబాధలు విస్తారముగ నుండును. ఆంధ్రదేశమునందు, శని కన్యయందు వక్రించుటచేతను, అధిక క్షయమాసములు గల్గుటచేతను, విశేష అరిష్టములు కల్గును. శ్రావణ శు ౧ ప్రాంతమునందును, భాద్రపద అమావాస్య ప్రాంతములందును, అధిక ఆశ్వయుజశుద్ధమందును అతివృష్టి, తుఫానులు, వాయుప్రాబల్యములు కల్గును. రెండవ పంటకంటె మొదటి పంట విస్తారముగ ఫలించును.

---

## చంద్రగ్రహణము (30—12—1982)

శ్రీ దుందుభినామ సంవత్సరం మార్గశిర శు॥ ౧౫ గురు॥ రే ముచ్యమానోదయ ఖచ్ఛన్న చంద్ర గ్రహణం. రాహుగ్రస్తం - కృష్ణతామ్రవర్ణం।



| | | ఘ. విఘ. | గం. ని. |
|---|---|---|---|
| సూర్యాస్తమయాది స్పర్శకాలః | మ | ౨౧—౩౫ | 3—20 |
| నిమీలనకాలః | సా | ౨౪—౨౫ | 4—28 |
| మధ్యకాలః | సా | ౨౫—౪౨ | 4—59 |
| ఉన్మీలనకాలః | సా | ౨౬—౫౭ | 5—29 |
| మోక్షకాలః | రా | ౨౯—౪౭ | 6—37 |

(బింబాదర్శన కాలము గం॥ 1—1 ఆద్యంత పుణ్యకాలము గం॥ 3—17)

చంద్రోదయకాలమందు బింబము 1/12 భాగము గ్రాస శేషము కనపడును.

ఉత్తరగోలము—అపసవ్యగ్రహణము, బింబ ప్రాగాగ్నేయ మధ్యస్పర్శయు, వాయవ్యమున నిమీలనమును, ఈశాన్యమున ఉన్మీలనమును, పశ్చిమ నైఋతి దిశలమధ్య మోక్షమును గల్గును.

ఆర్ద్రా నక్షత్రమందు జన్మించినవార లీ గ్రహణమును చూడరాదు.

నిత్యభోజనప్రత్యాబ్దికాదినిర్ణయము:— ఈ దినమున పగలు భుజింపరాదు. రాత్రిగ్రహణ మోక్షానంతరమునందు పాకముల నిర్వర్తించి రాత్రియందే భోజన ప్రత్యాబ్దికాదుల నాచరింపదగును.

ప్రమాణములు:— శ్లో॥ గ్రస్తోదయే విధోః పూర్వం నాఽహర్భోజనమాచరేత్।
ముక్తిం దృష్ట్వా తు భోక్తవ్యమితి శాస్త్రవినిర్ణయః॥
గ్రస్తే చంద్రేతూదితే తస్య ముక్తిం దృష్ట్వా తత్ర శ్రాద్ధమన్నే న కుర్యాత్॥

కార్తీక బ॥ ౩౦ బుధవారం (15—12—1982) న గల్గు సూర్యగ్రహణము ఆంధ్రదేశమందలి హైద్రాబాదు లగాయతు పశ్చిమ ఉత్తరదేశములందు 8 అక్షాంశములుగల ప్రదేశము లగాయతు స్వల్ప గ్రహణము సంభవించును. హైద్రాబాదునకు బింబ 1/141 మాత్రగ్రాసమే గల్గుటవలన దృశ్యము కానరాదు.

## ఈ సంవత్సరమునందు
## 2 అధికమాసములు 1 క్షయమాసము

సాధారణముగా 2 అధికమాసములు 3 సంవత్సరములకు ఒక పర్యాయము సంభవించును. లుప్త మాసము అనగా క్షయమాసము. దీనికి "అంహస్పతి" మాసమని నామము. ఇది 141 సంవత్సరములకు ఒక పర్యాయము సంభవించును. అది అగాయతూ 19 సం॥రములకుకూడా 1 పర్యాయము సంభవింప వచ్చు. సంభవింపకపోవచ్చును. గత 19 సం॥రములకు శోభకృన్నామ సం॥రమునందు లుప్తమాసము సంభవించి ఈ సం॥రమున తిరిగి లుప్తమాసము వచ్చినది.

అధికమాసము అనగా చైత్రాదిమాసములలో సూర్యసంక్రమణం లేకుండుట, లుప్తమాసము అనగా చాంద్రమాన మాసమునందు (2 సూర్యరాశ్యంతర) సంక్రమణములు సంభవించుటయు కారణములు—ఈ వత్సరమందు ఆశ్వయుజమాసము అధికమాసము అయినది. (పుష్య+మాఘము) లు కలసి లుప్త మాసము (మాసద్వయప్రయుక్తము) గను సంభవించినది. తదుపరి ఫాల్గుణమాసము అధికము అయినది— లుప్తమాసమునకు పూర్వమున, అధికమాసము పరమందు 1 అధికమాసమును (12 మాసములలో) సంభ వించును. తైత్తిరీయ శృతియందును, స్మృతి నిబంధన గ్రంథములందును, సర్వసిద్ధాంతరహతంత్రము లందును చెప్పబడియున్నది. ఇందులకు తైత్తిరీయ శృతియందు "ఉపయామ గృహీతాని సగ్ం సర్పో స్యహగ్ం స్పత్యాయ త్వేత్యాహ స్తి త్రయోదశో మాస ఇత్యాహు స్తమేవ తత్ప్రీణాతి" అనియు, సూర్య సిద్ధాంతమునందు

శ్లో॥ క్షయోత్పత్తిః కార్తికాది త్రయేనాఽన్యత్ర సంభవేత్ ।
తదానీం వర్షమధ్యే వై ద్వౌమాసౌ భవతోధికౌ ॥

సిద్ధాంత శిరోమణియందు

శ్లో॥ అసంక్రాంతిమాసోధిమాసస్ఫుటస్యాద్ద్విసంక్రాంతిమాసః క్షయాఖ్యః కదాచిత్ ।
క్షయః కార్తికాదిత్రయేనాఽన్యథాస్యాత్తదా వర్షమధ్యేఽధిమాసద్వయం చ ॥ ఇతి ॥

ఇందువలన క్షయమాసమునకు పూర్వము వచ్చు అధికమాసము సంసర్పనామమాసమనియు, లుప్త మాసమునకు అంహస్పత్య (అంహస్పతి) మాసమనియు తెలియబడుచున్నది. సంసర్పాధికమాసము శుద్ధమాసమువంటిదియని కొన్నిగ్రంథములందున్నను, ఆశ్వయుజమాసమునందలి దేవీవ్రత విజయదశమి, దీపావళీ మున్నగునవి నిజమాసమునందే చేయవలెనని బహుగ్రంథములనందు యున్నందున నిజ ఆశ్వయుజ మాసమునందే నిర్ణయించి వ్రాయబడినవి.

**క్షయమాసమునందు సంకల్పమునకు:**

ఈ సం॥రమునందు పుష్య+మాఘములు కలసి వచ్చుటచే ఈ ఉభయ మాసములందు చేయదగిన వైదిక కర్మలు, పైతృకకర్మలు, ఆ యా మాస ప్రయుక్తములను ఆ యా అయన, ఋతువులను ఉచ్చరించి చేయవలెను.

క్షయమాసమునందు శ్రాద్ధ సంపాతములు వచ్చినచో అనగా క్షయమాసమునందు ఒకే దినమునందు బహుశ్రాద్ధములు సంభవించినచో పూర్వమాస ప్రయుక్తములగువాటిని, ఆ యా అపరాహ్ణకాలములనుబట్టి వాటిని నిర్ణయించి ఒకే దినమున విడి విడిగ చేయవలెను.

ఇందులకు ప్రమాణములు :

శ్లో॥ అంహస్పతౌ తు కర్తవ్యం శ్రాద్ధమాబ్దికమాసికమ్।
పూర్వోత్తరార్థభేదేన చైకస్మిన్వాసరే పృథక్ ॥

జనన కారణములందు మాసనిర్ణయము

శ్లో॥ తిథ్యర్థే ప్రథమే పూర్వో ద్వితీయార్థే తదుత్తరః।
మాసావితి బుధైశ్చింత్యౌ మలమాసస్య మధ్యగౌ ॥ ఇతి ॥

అనగా జనన మరణములందు ఆ కాలమునకుగల విధియొక్క పూర్వార్థభాగమునందు పుష్యమాసము అనియు, ఉత్తరార్థమునందు మాఘమాసములుగను గ్రహించవలెను.

ఈ అధిక, క్షయమాసములు రెండును మలమాసములే యగును. గాన ఈమాసములను అన్వారంభణీయాది స్మార్త కాలప్రారంభమును, అగ్నిష్టోమాదిక్రతువులను ఆచరింపగూడదు. పూర్ణమాస్య, అమావాస్య ప్రయుక్తములగు ప్రకృతీష్టులను చేయవచ్చును. శాంతికపౌష్టిక కర్మలును చేయవచ్చును.

అబ్దత్రయ నిరూపణమ్

అస్మిన్ దేశే చాంద్రమానేన చైత్ర శుద్ధ ప్రతిపది దుందుభినామసంవత్సర ప్రారంభః। దక్షిణదేశే సౌరమానాబ్దో గ్రాహ్యః। సౌరమానేన చైత్ర శు ౧౩ మం॥రే (13–4–1982) సౌరవత్సరారంభః। వింధ్యస్య ఉత్తరదేశే బార్హస్పత్యమానేన యువనామసంవత్సరః। గురూదయవశాత్ కార్తీక శు ౧౩ శుక్రపర్యంతం చైత్రాబ్దః తదూర్ధ్వమావత్సరం వైశాఖాబ్ద ఇత్యుచ్యతే. అయం సర్వత్ర ఫలంప్రదర్శనార్థం భవతి॥

చాంద్ర, సౌరమానాబ్దఫలం

శ్లో॥ దుందుభి వర్షే సతతం వివిధోత్సవసంయుతా ధరణీ।
వివిధఫలసస్యపూర్ణా వివిధామయసంయుతా నూనమ్ ॥

ఈ సంవత్సరమందు ఎల్లప్పుడును ఉత్సవాదులతోను, వివిధఫల సస్యసంపూర్ణముగను, రోగాది బాధలు గల్గియుండును.

బార్హస్పత్యమానాబ్దఫలం

బార్హస్పత్యమాన వ్యవహారముగల దేశములందు శృంగార శ్రేష్ఠులు గల్గియుందురు. ఫలభక్ష్యాదులను సంపూర్ణముగ అనుభవింతురు. చోర, అగ్ని, రోగ, బాధలున్నను ప్రజలు సౌఖ్యవంతులయి యుందురు.

## గురూదయాబ్దఫలం

చైత్రాబ్దే భూమిపాః స్వస్థా క్షీణే చాల్పఫలప్రదా।
సుదుర్లభం చోత్తమాన్నం ప్రీతిస్సాధుజనస్య చ॥
ఇదం ఫలం కార్తీక శుద్ధ ౧౦ శుక్రపర్యంతం భవతి॥

ప్రభువులు స్వస్థచిత్తము గలవారగుదురు. సామాన్య పంటలు గల్గును. సత్పురుషులకు సంతోషము కల్గును.

## తదూర్ధ్వమావత్సరం వైశాఖాబ్దః - ఫలం

వైశాఖధర్మనిరతాః రాజాన స్స్యుః ప్రజాభృశమ్।
సంపూర్తిస్సర్వసస్యానాం ద్విజాశ్చాధ్వరతత్పరాః॥

ప్రభువులు ధర్మస్వభావము కల్గివుందురు. సర్వసస్యములు బాగుగా ఫలించును. దేవకార్యములు విస్తారముగా జరుగుచుండును.

## శ్రీ దుందుభినామ సంవత్సరస్య రాజాది నిర్ణయః

| | | |
|---|---|---|
| రాజా - శుక్రః | సస్యాధిపతిః - శనిః | మేఘాధిపతిః - కుజః |
| మంత్రీ - బుధః | ధాన్యాధిపతిః - గురుః | రసాధిపతిః - చంద్రః |
| సేనాధిపతిః - కుజః | అర్ఘాధిపతిః - కుజః | నీరసాధిపతిః - శుక్రః |

## ఉపనాయక నిర్ణయః

| | | |
|---|---|---|
| పురోహితః - శనిః | వర్షలగ్నం - సింహః | రత్నాధిపతిః - కుజః |
| పరీక్షకః - శుక్రః | గజాధిపతిః - శనిః | వృక్షాధిపతిః - గురుః |
| గణకః - సూర్యః | పశూనామధిపతిః - కుజః | జంగమాధిపతిః - శుక్రః |
| గ్రామపాలకః - కుజః | దేవాధిపతిః - శనిః | సర్పాధిపతిః - సూర్యః |
| దైవజ్ఞః - చంద్రః | నరాధిపతిః - కుజః | మృగాధిపతిః - కుజః |
| రాష్ట్రాధిపతిః - శుక్రః | గ్రామనాయకః - శుక్రః | శుభాధిపతిః - శుక్రః |
| సర్వదేశోద్యోగాధిపతిః-బుధః | వస్త్రాధిపతిః - చంద్రః | స్త్రీణామధిపతిః - కుజః |
| అశ్వాధిపతిః - బుధః | వర్షలగ్నాధిపతిః - రవిః | జగలగ్నం - మకరః |
| | | జగల్లగ్నాధిపతి - శనిః |

## 21—1—82 సావన సంవత్సరారంభం

సావన సంవత్సర మనగా 360 దినములు గలది. సృష్ట్యాదినుండి 360 దినములకొక సంవత్సరము చొప్పున ఈ గత సం॥రమునందు 21—1—82 సావన వర్షారంభమగును. సావన దినము అనగా 60 ఘటికలు లేక 24 గంటలు అగును.

### సావన వర్షాధిపతిః గురుః - ఫలం

వర్షాధిపతౌ జీవే వర్షాధిక్యం చ సర్వసస్యానామ్।
వాయూద్ధూత జలం ధాన్యం సస్యంస్యాన్మధ్యమం లోకే॥
గవాం క్షీరాభివృద్ధిస్స్యాత్ వృద్ధిస్సస్యోచితా భవేత్।
గోష్ఠాగారప్రావణం తు శ్రీ కృష్ణేన కృతం యది॥

తా॥ పశువులకు అనారోగ్యములుండవు. క్షీరాభివృద్ధిగలుగును. సర్వసస్యములు బాగుగా ఫలించును.

### గోష్ఠాబహిష్కర్తా యమః - ఫలమ్

మధ్యవృష్టిర్మందసస్యం స్వల్పక్షీరం తదా గవామ్
గోష్ఠాద్బహిః ప్రాపకే తు యమే సస్యవినాశనమ్॥

సస్యపీడలు. స్వల్ప క్షీరములు, సామాన్య వర్షములు గల్గును.

### వర్ష ప్రమాణం

ద్రోణ (4 కుంచములు) వర్షములు.

### ఆఢక ప్రమాణం

శ్లో॥ షష్ఠియోజనవిస్తీర్ణం శతయోజనమున్నతమ్।
ఆఢకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే॥

తా॥ దేవతామానముచే 480 మైళ్లు చుట్టుకొలతయు, 800 మైళ్లు ఎత్తునుగల 2 కుంచముల వర్షము కురియును.

### భాగ నిర్ణయః

అష్టౌ భాగాన్సముద్రేషు పర్వతేషు తథా నవ।
త్రిభాగాః భువి సంప్రోక్తాశ్చైవం వర్షతి చ త్రిధా॥

8 భాగములు సముద్రము లందును 9 భాగములు మెట్టప్రదేశములందును 3 భాగములు భూమి యందును వర్షించును.

### ఆఢకస్థితి నిర్ణయము

వత్సరాదినుండి అధిక ఆశ్వయుజ బ॥ 3 మం॥ పర్యంతం వృద్ధ బ్రాహ్మణ హస్తమందు ఉండును. దుర్భిక్ష సూచనములున్నను సుభిక్షములు కల్గియే యుండును. ఆశ్వయుజ బ॥ ౩ మంగ॥ నుండి మార్గశిర బ॥ ౧౪ గురు॥ పర్యంతం బాలగోపాలహస్తమునందుండును. ఈ కాలమునందు మధ్యమ ఫలితములు, స్వల్పవర్షములు గల్గును. మార్గశిర బ ౧౪ గురు ప్ర॥ నిజ ఫాల్గుణము బుధ॥ పర్యంతము యౌవన గోపాలహస్త మందును, తదాది ఆ వత్సరము బాలగోపాల హస్తమందుండును. ఈ కాలము నందు సస్యానుకూల వాతావరణములు సుభిక్షములు కల్గును.

## వర్ష ధాన్యాది ప్రమాణములు

వర్షం ౧౯, ధాన్యం ౧౯, శీతం ౨, తృణం ౯, ఉష్ణం ౨, మారుతం ౩, ప్రజావృద్ధి ౧౫, నాశః ౧౫, రాజవిద్వరం ౧౧, ఉగ్రం ౫, పుణ్యం ౫, పాపం ౫. (౭౧) వ్యాధి ౮, ఉపశమనం ౭౧, ఆచారః ౭౧, అనాచారః ౧౫, మరణాః ౩, జన్మాని ౭౧, దేశోపప్లవః ౭౧, దేశస్వాస్థ్యం ౧౫, చోరభయం ౭౧, నాశః ౨, అగ్నిభయం ౧౧, నాశః ౧౩, మృగోపద్రవం ౭౧, నాశః ౧౩, కీటకవృద్ధి ౧౯, నాశః ౧౧, మహిషవృద్ధిః ౧౧, నాశః ౭౧, సర్పవృద్ధిః ౨, నాశః ౭౧, కామః ౧౩, లోభః ౧౩, మోహః ౧౯, మదః ౧౧, మత్సరః ౫, సుఖం ౯, దుఃఖం ౧౧, భోగః ౧౧, విడంబః ౯, మనోవ్యథా ౫, ద్వేషః ౧౩, ప్రతిష్ఠా ౧౧, అప్రతిష్ఠా ౭౧, ద్యూతః ౫, ప్రమాదః ౭౧, పరోత్పత్తిః ౧౧, స్త్రీఉత్పత్తిః ౧౩, ధాతువాదః ౫, భయం ౯, శౌర్యం ౧౩, దుష్టనిగ్రహః ౧౩, శిష్టప్రతిపాలనం ౭౧, సత్యం ౨, అసత్యం ౯, విశ్వాసః ౧౧, అవిశ్వాసః ౧౩, దయా౧౫, నిర్దయా౧౩, న్యాయః౧౯, అన్యాయః ౮, (౧౭)గోమాయువృద్ధిః౫, నాశః ౩, సస్యకీటకవృద్ధి ౧౧, నాశః ౧౧, శలభ ౧౧, నాశః ౨, మశక ౩, నాశః ౩, మత్కుణః ౧౧, నాశః ౨, వృశ్చికః ౨, నాశః ౯, వ్యాఘ్రః ౨. నాశః౧, (౯) సస్యవృద్ధి ౨, నాశః ౬, శుకః ౧౧, నాశః ౨, పిక ౫, నాశః ౨, కుక్కుట ౮ నాశః ౮ (౬) ఖగవృద్ధి ౩ నాశః ౫ గోవృద్ధిః ౪, నాశః ౫, మహిష ౬, నాశః ౩, మృగ ౬, నాశః ౩, అజ ౫, నాశః ౭, అశ్వ ౩, నాశః ౭, గజ ౪, నాశః ౪, ఉష్ట్ర ౫, నాశః ౭, విప్ర ౧౧, నాశః ౩, క్షత్రియ ౪, నాశః ౬, వైశ్య ౫, నాశః ౬, శూద్ర ౫, నాశః ౭ మ్లేచ్ఛ ౭, నాశః ౬, సంకర ౫, నాశః ౩, వజ్ర ౫, వైఢూర్య ౭, గోమేధిక ౩, పుష్యరాగ ౪, మరకత ౫, మాణిక్యం ౧, నీల ౧, మౌక్తిక ౧, ప్రవాళ ౧, (౧౪) సువర్ణ ౧౪, రజిత ౧౪, తామ్ర ౭, కాంస్య ౪, లోహ ౪, అయో ౭, త్రపు ౧౦, సీసం ౧౦, రస ౬, (౧౯) జ్ఞానం ౩, అజ్ఞానం ౧౯, కాపట్యం ౧౩, నిష్కాపట్యం ౧౨. ధార్మికత్వం ౧౫, అధార్మికత్వం ౩, (౮) విద్యుత్ ౮, (౨) శిలాపాతః ౨, (౬) గర్జితం ౬, (౧౪) స్వప్నం ౧౪, సుషుప్తి ౧౪, జాగ్రత్ ౭, (౧౯) అండజ ౧౯, నాశః ౧౯, స్వేదజ ౨, నాశః ౯, ఉద్భిద ౨, నాశః ౨, జరాయుజ ౧౫, నాశః ౧౫, స్థావరం ౪, నాశః ౫, జంగమ ౫, నాశః ౫, (౧౮) వ్రీహి ౧౪, శాలి ౪, కులద్ధ ౧౦, తిల ౧౪, మాష ౧౪, ముద్గ ౧౪, సర్షప ౮, చణక ౧౮, ఆఢక ౧౮, గోధూమ ౮, కోద్రవ౧౮, ప్రియంగు ౧౪, యామనాళ౧౮ శ్యామక ౧౦, రాజమాష ౬, నీవార ౧౭, శింబి ౭, (౧౯) అతివృష్టి ౧౯, అనావృష్టి ౧౫, స్వచక్రభయం ౯, పరచక్రభయం, ౧౯, (౧౫) క్షుత ౧౫, తృష్ణా ౩, నిద్రా ౧౩, ఆలస్యం ౫, ఉద్యోగం ౨, శాంతిః ౧౫, క్రోధః ౧౧, డంబం ౩, మిత్రభేదః ౩, మైత్రీ ౧౫, రసనిష్పత్తిః ౨, ఫలనిష్పత్తిః ౨, ఉత్సాహః ౯, ప్రాణిసౌఖ్యం ౧.

---

### నవనాయకఫలాని

### రాజా శుక్రః — ఫలం

శుక్రస్య రాజ్యే బహుసస్య సంకులా గావో హి సంపూర్ణపయః ప్రదాస్స్యుః।
ఫలంతి వృక్షాః బహు గోప్రసూతిః వసుంధరాపార్థివ సౌఖ్యసంయుతా ॥

సస్యములు బాగుగా ఫలించును. పశుగణములు సుఖించును. ఫలవృక్ష పుష్ప లతాదులు, రమణీయముగ నుండి చక్కగఫలించును ।పశు గణములు మిత్రభావముతో వంచరించును.

## మంత్రీ బుధః — ఫలం

వాయునాపీడితాః మేఘాః సర్వే పాపకృతో నరాః।
సోమపుత్రస్య మంత్రిత్వే జాయతే మధ్యమం ఫలమ్॥

మేఘములకు వాయు క్షోభములు, ప్రజలు పాపకర్మల యందాసక్తిగలవారును, సామాన్య ఫలితములు నందును.

## సేనాధిపతిః కుజస్య — ఫలం

ఆతంకపీడా భువి సస్యనాశో లోకాస్సమస్తాః జ్వలితాః భవంతి।
అత్యంతయుద్ధం క్షితిపాలకానాం కుజే తు సేనాధిపతౌ ధరిత్ర్యామ్॥

సస్యపీడలు, జ్వరాది భయములు, యుద్ధబాధలు కల్గియుండును.

## అర్ఘాధిపతిః కుజః — ఫలం

భౌమే చాఽర్ఘపతౌ స్వల్పవృష్టిర్వాయు సమన్వితా।
క్వచిద్వృష్టిః క్వచిద్ధాన్యం ప్రజారోగ్యం క్వచిత్క్వచిత్॥

వాయు మిశ్రిత వర్షములు, ఖండవర్షములు, ఒకచోట ఫలించుట, మరియొకచోట సామాన్యపంటలు, ఎల్లప్పుడు రోగబాధలు కల్గును.

## మేఘాధిపతిః కుజః — ఫలం

మహావాయురవర్షం చ స్వల్పవర్షం తథా భువి।
రక్తసస్యాభివృద్ధిస్స్యాత్ భౌమే మేఘాధిపే సతి॥

ఎఱ్రనిభూములు, సస్యములు ఫలించుట, వాయుపీడలు, స్వల్ప వర్షములు సంభవించును.

## సస్యాధిపతిః శనిః — ఫలం

తిలమాషకుళుద్ధాది కృష్ణధాన్యాని యాని చ।
కృష్ణభూమి స్సుఫలితా శనౌ సస్యాధిపే సతి॥

నువ్వులు, మినుములు, ఉలవలు మున్నగునవియు ఎఱ్రనిభూమియు, ఫలించును.

## ధాన్యాధిపతిః గురుః — ఫలం

గురౌ ధాన్యపతౌ యాతే యవగోధూమశాలయః।
పచ్యంతే సర్వదేశేషు యజ్వానో బ్రాహ్మణాస్సదా॥

యవధాన్యములు, గోధుమలు, శాలిధాన్యములు బాగుగా ఫలించును. విప్రులు క్రతువుల నాచరింతురు.

రసాధిపతిః చంద్రః - ఫలం

తిలతైలగురు క్షౌద్రపయాంసిదధి శర్కరాః।
అర్ఘవృద్ధిస్సదారోగ్యం చంద్రే యది రసాధిపే॥

నువ్వులు, నూనెజాతులు, శర్కర క్షీరములు, విస్తారముగ ఫలించి వీటికి ధరలు పెరుగును. సర్వ దేశములందును ప్రజావృద్ధి కల్గును.

నీరసాధిపతిః శుక్రః - ఫలం

కర్పూరాగరుగంధానాం హేమమౌక్తిక వాససామ్।
వృద్ధమోర్ఘేణ జాయంతే శుక్రే నీరసనాయకే॥

కర్పూరము, సుగంధద్రవ్యములు, సువర్ణ అంబరాదులు వీటికి మరింతధరలు పెరుగును.

పురోహిత్యాధిపతి ఫలములు

వీరలు క్రూరులగుచో క్రూరఫలములును, శుభులగుచో శుభ ఫలితమును కలుగచేయుదురు.

రవిచార ఫలాని

చైత్ర బ ౫ మంగళవాసరే మేషప్రవేశః ఘ ౫౦-౫౮ రాత్రి గం॥ 2-29
వారఫలం - సౌభాగ్యం సౌమ్యవాసరే।
కాలఫలం - రాత్రౌ సస్యాభివృద్ధి స్యాత్।
ఆర్ద్రాప్రవేశకాలతిథ్యాధిఫలాని - ఆషాఢ శు ౧ మంగళవాసరే ఆర్ద్రాప్రవేశః ౧౩-౫౩।
తిథిఫలం - ప్రతిపది యది చార్ద్రాయాః ప్రవేశః శుభదో భవేత్।
వారఫలం - భౌమే వృష్టి వినాశనం।
నక్షత్రఫలం - అనావృష్టి రవర్షత్వం రౌద్రర్కే కురుతే రవిః।
యోగఫలం - వృద్ధియోగేఽభివృద్ధి స్స్యాత్।
కరణఫలం - సింహే వ్యాధిభయం కుర్యాత్।
కాలఫలం - దివార్ద్రా సస్యనాశినీ।

షణ్మండల ఫలం

ఆర్ద్రాప్రవేశే సూర్యస్య చంద్రో రౌద్రాచ్చతుష్టయే।
ప్రథమే మండలే తిష్ఠన్ సర్వసస్య సమృద్ధిదః॥

తా॥ సూర్యుని ఆర్ద్రాప్రవేశమున చంద్రుడు ఆర్ద్రాది ద్వితీయమండలమున్నందువ సర్వసస్యములు బాగుగ ఫలించును.

## చంద్రచారఫలాని

### జ్యేష్ఠ శుద్ధ ప్రతిపద్యుక్త వారఫలం.

సుభిక్షం క్షేమమారోగ్యం వృద్ధిస్సస్య వివర్ధనమ్ ।
ఆనందనిరతా ధాత్రీ జ్యేష్ఠాదౌ చేందువాసరే ॥

తా॥ జ్యేష్ఠాది చాంద్ర వారమగుటచే సర్వసస్యములు బాగుండును. అందుచే జనానందము గల్గియుండును.

### ఆషాఢ శుక్ల పంచమీయుత వారఫలం

శ్లో॥ ఆషాఢసిత పంచమ్యాం మందవారో భవేద్యది ।
లోకానాం భయపీడా చ దుర్భిక్ష మధికం ధ్రువమ్ ॥

తా॥ ప్రజలకు భయోత్పాత పీడలు, దుర్భిక్ష సూచనలు కల్గియుండును.

### ఆషాఢశుక్లపక్షస్థస్వాతీయుత తిథివారఫలం

శ్లో॥ ఆషాఢేశుక్లపక్షే తు దశమీ యది సంయుతా ।
స్వాతీయుక్తేన చంద్రేణ మహద్వర్షం భవేద్ధ్రువమ్ ॥

తా॥ గొప్పవర్షములు కురియును.

### ఆషాఢకృష్ణపక్షే రోహిణీయుత తిథిఫలం

శ్లో॥ ఆషాఢే కృష్ణపక్షే తు రోహిణ్యేకాదశీయుతా ।
సర్వధాన్యాభివృద్ధిస్స్యాత్ సువృష్టిశ్చ మహీతలే ॥

తా॥ సర్వధాన్యములు బాగుగ ఫలించును. సువృష్టియవిపించును.

## కుజచారఫలాని

వత్సరాది ప్ర॥ వైశాఖ బ॥ ౪ బుధ॥ ప॥ కన్యారాశౌ ఉత్తరఫల్గునీ హస్త నక్షత్రయోః కన్యారాశౌ కుజవక్రం ॥

ఫలం :— అథోత్తరాయాం చ జలవృష్టి రోధచ్చతుష్టదే పీడనమశ్వమూల్యమ్ ।
హస్తే కుజేల్పాంబు చతుశ్చధాన్యం మృతం గంధం లవణం మహార్ఘః ॥

## రాశివక్రఫలం

సింహే మీనేఽథ కన్యామిథునధనుషి వా వక్రితౌ మందభౌమే ।
పృథ్వీసంరుద్ధ భూపారిపురశతాల్రిగహాంతా న ఘోరా ॥

ఫాల్గుణ శు॥ ౧౧ శుక్రవాసరే మీనరాశౌ కుజాస్తమయః ఉత్తరఫల్గునీ హస్తలయందు కుజుడు వక్రగామియగుచో పశుపీడలు, స్వల్పవర్షములు, ధాన్యమునకు గొప్పధరలు, యుద్ధబాధలు, ప్రజలు శుభ లక్షణములుగలవారుగ నుండుట తటస్థించును.

## గురుచారఫలం

ఈ సంవత్సర కార్తీక శు ౯ గురు॥ పర్యంతం గురునికి తులారాశిస్థితి కల్గుటచే గొప్పగా ధరలు, సర్వధాన్యములు బాగుగ ఫలించుటయు, రోగబాధలు విస్తారముగ నుండుటయు కల్గును. కార్తిక శు ౯ గురు॥ల ఆవత్సరం వృశ్చికరాశిస్థితి కల్గుటచే అప్పుడప్పుడు అనావృష్ట్యాదిబాధలు, దుర్భిక్షసూచనలు క్రూరకర్మలు సంభవించును.

## శుక్రచారఫలం

అధిక ఆశ్వయుజ శు ౧౪ శని॥న కన్యారాశియందలి ఉత్తరఫల్గునీ నక్షత్రమునందు మనుష్య గణ నక్షత్రమునందు, భూశిద్వారమునందు శుక్రాస్తమయము కల్గుటచే సస్యపీడలు వస్త్రములు, ప్రత్తి, వీటికి నష్టములు, ఉత్తరదేశములందు యుద్ధములు, ప్రజలకు దుర్భిక్ష ఉపద్రవములు సంభవించును. కార్తీక బ ౮ బుధ॥న ధనూరాశియందు మూలానక్షత్రనందు, రాజద్వారమునందును శుక్రోదయము కల్గుటచే ప్రభువుల కరిష్టములు, వర్షలోపములు సంభవించును.

## శనిచారఫలం

వత్సరాది ప్రభృతి అధిక ఆశ్వయుజ బ॥ ౩ మం॥ వ॥ శనికి తులారాశిస్థితి. ఇందుచే రాజకీయ పరిస్థితులు విషమముగ నుండుటయు భూకంపాదులు, వాయుప్రాబల్యములు, ధరలు మరింత పెరుగు టయు సంభవించును. అధిక ఆశ్వయుజ బ॥ ౩ మం॥ ప్ర॥ ఆవత్సరము శనికి వృశ్చికరాశిస్థితి కల్గుటచే ఈ కాలమునందు బహువిధ విప్లవములు, భూపతులకత్యంతారిష్టములు, ప్రజలకు విస్తారముగా ఈతిబాధలు తటస్థించును. మరియు ఉత్తర ఫల్గునీ, హస్త, చిత్రా నక్షత్రములందు సంచారము గల్గుటచే ఘృతము, బెల్లము, లవణము వీటికి వస్తులోపమును, అరణ్యమృగములకు, లేఖకులకు, చిత్రకారులకు, స్త్రీలకు అరిష్టములు సంభవించును.

## గ్రంథాంతరశనిస్థిత రాశిఫలం

శ్లో॥ కన్యాగతే సూర్యసుతే తురంగమృగేత్ ధాన్యార్ఘ సువృష్టివృద్ధిః ।
నష్టం తథా కార్ముక పంచకం స్యాత్ రసాశ్చ షడ్భూత పతయశ్చ నష్టాః ॥

## తులారాశి స్థితిఫలం

శ్లో॥ తటస్థితే భానుసుతే సువృష్టిః సస్యాభివృద్ధి స్సుఖినో నరాశ్చ।
కౌసుంభలాక్షారసకుంకుమాద్యాః నృత్తోపజీవివ్రమదాశ్చ నష్టాః॥

## కూర్మచక్ర (శనిసంచార) ఫలము

ఉత్తరఫల్గునీ, హస్త, చిత్రానక్షత్రములందు శనిసంచార కూర్మచక్ర ఫలితముచేత రేవా, భీమ రథీనదీ ప్రాంతములందును, లంకా, త్రికూట మలయా, ఆంధ్ర, పాండ్య, కాంచీ మున్నగు దక్షిణ దేశములందు విశేష అరిష్టములు సంభవించును.

## గ్రహణమాస ఫలితములు

మార్గశిరమాసమునందు చంద్రగ్రహణము సంభవించుటచే సువృష్టియు, పైరులు బాగుగా ఫలించుటయు, రోగబాధలు, కాశ్మీర, కోసలా, పౌండ్ర దేశములందరిష్టములు సంభవించును.

---

## మకర సంక్రమణ పురుష లక్షణము

పుష్య శు॥ ౧ శుక్ర॥ రే (14—1—1983) రవేః మకరప్రవేశాః ఘ ౨౭-౧౪ సా॥ గం॥ 5-40

శ్లో॥ అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూ ర్దీర్ఘనాసికః।
అష్టబాహుశ్చతుర్వక్త్రః సంక్రాంతి పురుషస్స్మృతః॥
శతయోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశన్మృతమ్।
ఏవం రూపం హి విజ్ఞేయం సంక్రాంతి పురుషస్య తు॥

అస్య పురుషస్య మిశ్ర నామధేయం - పశూనామరిష్టం । శంఖోదకస్నానం - ఆరోగ్యం । మాషాక్షతాః - మాష నాశనం । కంచుకవస్త్రం - నటకారిష్టం । బిల్వగంధః - వేవ్యారిష్టం । కుందపుష్పం - శుభం । వైడూర్యాభరణం - రాజ్ఞామరిష్టం । వేణుపాత్రం-ఆరోగ్యం । శర్కరాహారం- సౌఖ్యం । పనసఫలం - రోగనాశనం । కుక్కుట వాహనము - అతివృష్టి । బాణాయుధము - అశుభాని । శూన్య ఛత్రం - ఆరోగ్యం । ఉల్కాధారణం - అశుభం । సర్వ దిగ్యానం - సర్వదేశారిష్టం । ఉన్మాదచేష్టా - ప్రజారోగ్యం । ఊర్ధ్వస్థితో భవతి - రాజ్ఞాం శుభం ।



## పక్షఫలం

శ్లో॥ శుక్లపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః।
ప్రజానాం వ్యాధిపీడాశ్చ నృపాణాం సమరం భవేత్ ॥

తా॥ రోగబాధలు, యుద్ధ సన్నాహములు విస్తారములు.

## తిథ్యాది ఫలం

శుక్ల ప్రతిపత్ అగుటచే క్షేమములు, శుక్రవారము - గొప్ప ధరలు, ఉత్తరాషాఢానక్షత్రము - విప్రపీడ. యుద్ధభయములు, హర్షణయోగము - సంతోషములు, కింస్తుఘ్న కరణము - గొప్పనష్టములు, కర్కాటకలగ్నము - విస్తారముగ వర్షములు, 1౬ వ ముహూర్తము - సువృష్టి ఇట్లు కల్గును.

## ఫలశ్రుతిః

శ్లో॥ సంక్రాంతి పురుషోత్పత్తికాలే దానం స్వశక్తితః।
ఫలం కాంస్యాది ధాన్యాని దీయతే దోషనాశనమ్॥
ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాం శుకాద్యం సతితేషు గావః।
ధాన్యం ఖరాంశోర్మకరప్రవేశ ఏతాని దానాని విశేషదాని॥
మకరస్థే తీక్ష్ణభానౌ ధాన్యదానం కరోతి యః।
తేజస్వీ రూపవాన్మర్త్యః సార్వభౌమః ప్రజాయతే॥
యశ్శృణోతి మధు శుక్లపక్షకే వర్షనాథ సచివాదికం ఫలమ్।
ప్రాప్నుయాద్దురితముక్తవిగ్రహశ్చాయురర్థమతులం యశస్సుఖమ్॥
కాలాన్యపరాగాదను క్త్వా పుణ్యాని కారయేద్యస్తు।
తేషామంశం దశమం నియమేనాప్నోతి దైవజ్ఞః॥
ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభివృద్ధిం నిత్యారోగ్యం మంగళం నిర్వ్యపాయమ్।
అచ్ఛిన్నానాముత్సవానామవాప్తిం యచ్ఛంత్వేతే వత్సరాధీశ ముఖ్యాః॥

తా॥ మకరసంక్రమణ ప్రవేశకాలమునందు యథాశక్తి కాంస్య, ధాన్య, అజిన, సువర్ణ, ఆజ్య, వస్త్రదానములను చేయుటచే విశేషఫలము నొంది, ఆయురారోగ్య ఐశ్వర్య పుత్ర పౌత్రాభివృద్ధిని పొంది శుభఫలితముల నొందగలరు.

## ఆదాయ వ్యయములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ఆ. | ౨ | వ్య. | ౮ | ధనుర్మీనయోః | ఆ. | ౫ | వ్య. | ౧౪ |
| వృషభతులయోః | ,, | ౧౧ | ,, | ౧౪ | మకరకుంభయోః | ,, | ౮ | ,, | ౮ |
| మిథునకన్యయోః | ,, | ౧౪ | ,, | ౧౧ | సర్వాదాయః | | ౫౯ | | |
| కటకస్య | ,, | ౮ | ,, | ౧౧ | సర్వవ్యయః | | ౭౧ | | |
| సింహస్య | ,, | ౧౧ | ,, | ౫ | అధికవ్యయః | | ౧౨ | | |

## రాజపూజ్యత్వాఽవమానాని

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | రా. ౧ | అ. ౭ | సింహస్య | రా. ౬ | అ. ౩ | ధనుషః | రా. ౪ | అ. ౨ |
| వృషభస్య | ,, ౪ | ,, ౭ | కన్యాయాః | ,, ౨ | ,, ౬ | మకరస్య | ,, ౭ | ,, ౨ |
| మిథునస్య | ,, ౭ | ,, ౭ | తులాయాః | ,, ౫ | ,, ౬ | కుంభస్య | ,, ౩ | ,, ౫ |
| కటకస్య | ,, ౩ | ,, ౩ | వృశ్చికస్య | ,, ౧ | ,, ౨ | మీనస్య | ,, ౬ | ,, ౫ |

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్రి | పున | పుష్య | ఆశ్రే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ |

| మఖ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్ర | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ |

| మూల | పూ-షా | ఉ-షా | శ్రవణం | ధనిష్ఠ | శత | పూ-భా | ఉ-భా | రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|
| ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౩ | ౧ | ౨ | ౦ |
| ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ |

శ్లో॥ విషమేష్వర్థలాభస్స్యాత్సమేషు సమతా భవేత్ । శూన్యేషు శూన్యమాప్నోతి కందాయఫలమీదృశమ్ ॥
ఆదిశూన్యే భవేద్వ్యాధి ర్మధ్యశూన్యే మహద్భయమ్ । అంత్యశూన్యే భవేద్ధాని స్త్రిషుశూన్యేషు నిష్ఫలమ్
ఏకైకస్య చతుర్మాసం కందాయానాం ఫలం క్రమాత్ ॥

## సంవత్సర ఫలమ్

అశ్వి, పుష్య, స్వాతి, అభిజిత్ వారికి — రోగభయం
భరణి, ఆశ్రే, విశాఖ, శ్రవణం వారికి — ఆయుర్వృద్ధి
కృత్తిక, మఖ, అనూరాధ, ధనిష్ఠ వారికి — అర్థలాభము
రోహిణి, పూర్వఫల్గునీ, జ్యేష్ఠ, శతభిషం వారికి — మనస్తాపము
మృగ, ఉ-ఫ, మూల, పూ-భా వారికి — రాజపూజ్యత
ఆర్ద్రి, హస్త, పూ-షా, ఉ-భా వారికి — యుద్ధభయం
పున, చిత్ర, ఉ-షా, రేవతి వారికి — అలంకారప్రాప్తి

# వర్ష యోగములు

చైత్రమాసము:— ఇందు రవి, బుధ, శనులకు వాయు దహన నాడీసంచారము. మిగిలిన గ్రహములకు అమృత, జల, రస, సౌమ్యనాడీసంచారము కలదు. ఈ మాసమంతయూ మేఘాడంబరము కలిగి శుక్లపక్షమున ఖండవృష్టికల్గును. బహుళపక్షమందు ఎండలువాయు ప్రాబల్యము కల్గును. చాంద్రయోగంబుచే మార్చి 29—30 ఏప్రి 2,3,7,8,14,15,18,21 తేదీలయందు ఆకస్మిక వర్షయోగములు ఖండవృష్టికల్గును.

వైశాఖమాసము:— ఇందు రవి, బుధ గురులకు మహావాయు నాడియందును, మిగిలిన గ్రహములకు రస సౌమ్యనాడీ సంచారము కలదు. శు ౪ లగాయతూ బ ౬ వరకూ గాడ్పులు, బుధ రవులవల్ల మధ్యమవర్ష ప్రతిబంధకములు కలవు. గాలిదుమారము హెచ్చుగా యుండును. అమావాస్యప్రాంతమున ఖండవృష్టి కల్గును. చాంద్రయోగంబులచే ఏప్రిల్ 26,27 మే 5,6,7,15, 16,19,20 తేదీలలో ఆకస్మిక వర్షముల సూచనలు కల్గును.

జ్యేష్ఠమాసము:- ఇందు రవి, బుధ, గురు, శుక్రులకు వాయు, మహావాయునాడీ సంచారముకలదు శు ౧౨ లగాయతు బ ౭ వరకు పురో రాహు, రవి మధ్యం. శు ౧౧ కి బుధాస్తమయము, బ ౪ బుధోదయము కలవు. శుద్ధమున వేడిగాడ్పులు వీచును. అమావాస్య ప్రాంతంబున తొలకరి వానలు ప్రారంభించును. చాంద్రయోగంబులచే మే 24,25 జూన్ 1,2,11,12,15,16,20,21 తేదీలలో ఖండవృష్టికల్గును.

ఆషాఢమాసము:— ఇందు రవి రాహు, కేతువులకు సౌమ్య, రస నాడులందును. మిగిలిన గ్రహములకు వాయు, మహావాయు, దహననాడీ సంచారంబును కలదు. శు ౪ లు॥ బుధ శుక్రులకు ఏకరాశిస్థితి, బ ౩ లు॥ చిత్రా కుజుడు వృష్టి ప్రదములు. బహుళమున హెచ్చువర్షములు కురియును. చాంద్ర యోగంబులచే జూన్ 28,29, జూలై 9,10,13,14,18,19 తేదీలలో వర్ష సూచనలు.

శ్రావణమాసము:—ఇందు కుజ, గురు, శనులకు దహన, వాయునాడీయందును, మిగిలిన గ్రహములకు సౌమ్య, రస, జల అమృతనాడీ సంచారంబును కలదు. శు౨ అంగారకచలనము, శు౧౮ వ॥ చిత్రాకుజుడు వృష్టిప్రదము. శు ౧౧ లగాయతూ కాలసర్పయోగము. బ ౫ లు॥ పురోరవి బ ౧౩ లు॥ పురోంగారక రవిమధ్యము. అనావృష్టి ప్రదము. శుద్ధమున వర్షములుహెచ్చు. చాంద్రయోగములచే జూలై 22,24,27,28, ఆగ 5,6,7,9, లు॥ 12,15,16 తేదీలలో వర్షములు కురియును.

భాద్రపదమాసము:—ఇందు కుజ, గురు, శనులకు దహనవాయు, మహావాయులందును, మిగిలిన గ్రహములకు అమృత, జల, రస, సౌమ్యనాడీ సంచారంబు కలదు. బ ౭ అంగారక చలనము, శు ౧౪ లు॥ పశ్చిమదిశ మఘాదిపంచక శుక్రుడు వృష్టిప్రదములు. శు ౪ వరకూ పురోంగారక రవి మధ్యము మాసం కాలసర్పయోగము, పురశ్శని మధ్యమము అనావృష్టిప్రదములు. బహుళమున వర్షములు హెచ్చును. చాంద్రయోగంబులచే ఆగ 24,25, సెప్టెం 1,2,5,6,10,13,14 తేదీలయందు వర్షములు కురియును.

(సంసర్ప)ఆశ్వయుజమాసము:- ఇందు రవి, బుధ, శుక్ర, రాహువులకు రస, సౌమ్యనాడులయందును, మిగిలిన గ్రహములకు వాయు, మహావాయు, దహననాడులయందును సంచారముకలదు. శు ౧౪ శుక్రాస్తమయము. శు ౯ నుండి బ ౩ వరకూ చాతుర్గ్రహకూటము. శు ౯ ల॥ బుధ శుక్ర సమాగమము. ఈ మాసం పశ్చిమదిశి మఘాది పంచక శుక్రుడు వృష్టిప్రదములు. ఈ మాసము సంసర్ప యోగము కలదు. బహుళమందు హెచ్చువర్షములు కురియును. సెప్టెం 19,20,23,24,28,29 అక్టోబరు 3,4,7,8,10,11 తేదీలలో వర్షములు కురియును.

నిజ ఆశ్వయుజమాసము :- ఇందు రాహ్వేతర గ్రహములన్నిటికీ వాయు మహావాయు, దహననాడీ సంచారంబునుకలదు. శు ౩ వరకూ బుధ, శుక్ర సమాగమము. శు ౯ ల॥ ప్రాగ్దిశి స్వాతీత్రయ శుక్రుడు. ఈ మాసం మఘాది పంచక శుక్రుడు, శు ౬ అంగారకచలనము, శు ౧౪ గుర్వస్తమయము. ఈ మాసము కాలసర్పయోగము కలదు. గాలితో కూడిన వర్షములు కురియును, అమావాస్య ప్రాంతములందు తుఫానులు కల్గును. చాంద్రయోగంబులచే అక్టోబరు 20,21,26,27,28 నవంబరు 1,2,6 నుండి 8,13,14 తేదీలలో వర్షములు కురియును.

కార్తీక మాసము :- ఇందు కుజ, శుక్రులకు సౌమ్య, రస, నాడులందును, శు ౧౫ అంగారక చలనము, బ ౭ శుక్రోదయము, శు ౧౦ గురూదయము, శు ౯ గురుచలనము, శు ౧౧ వ॥ ప్రాగ్దిశిస్వాతీత్రయ శుక్రుడు, శు ౯ వ॥ పశ్చిమదిశి మఘాది పంచక శుక్రుడు, శు ౧౧ వరకూ మఘాది పంచక శుక్రుడున్నూ కలదు. శు ౧౦ వరకూ గాలితో కూడిన వర్షములు కురియును. చాంద్రయోగములచే నవం 16,17,27,28 డిశంబరు 1,2,4,5,8. తేదీలలో ఆకస్మిక వర్షములు కల్గును.

మార్గశిరమాసము :- ఇందు గురు శనులకు వాయు నాడియందును మిగిలిన గ్రహములకు సౌమ్య, రస, జల, అమృత శుక్ర, బుధ సమాగమము. ఈ మాసమంతయు మేఘాడంబరము కల్గి తుషారవృష్టి కల్గును. చాంద్రయోగములచే డిశంబరు 19,20,21,26,27 జనవరి 1,2,3,9 తేదీలలో ఆకస్మిక వర్షసూచనలు కలుగును.

(పుష్యమాఘయుగళీభూతము) మాఘమాసము :- ఇందు గురు శనులకు వాయు, మహావాయు నాడులయందును, మిగిలిన గ్రహములకు రస, జల, అమృత నాడీసంచారంబును, ఈ మాసమంతయు మేఘాడంబరమును కలదు. అచ్చటచ్చట తుషారవృష్టి కలుగును. చాంద్రయోగంబులచే జనవరి 17,18,23,26,27,29 ఫిబ్రవరి 1,2 తేదీలలో ఆకస్మిక వర్షసూచనలు కల్గును.

అధిక ఫాల్గుణమాసము :- ఇందు రవి, గురులకు వాయునాడీయందును మిగిలిన గ్రహములకు సౌమ్య, రస, జల, అమృతనాడీ సంచారమును కలదు. శు ౩ అంగారకచలనము, బ ౧౦ బుధాస్తమయము కలదు. వర్ష ప్రతిబంధకములు హెచ్చు. చాంద్రయోగంబులచే ఫిబ్రవరి 14,15,16,25,26 మార్చి 1,2,6,7 తేదీలలో ఆకస్మిక వర్షములు కల్గును.

నిజ ఫాల్గుణమాసము :- ఇందు రవి, బుధులకు సౌమ్య నాడీయందును మిగిలిన గ్రహములకు దహన వాయు నాడీయందును సంచారంబు కలదు. అనావృష్టియోగములు హెచ్చు. శు ౧౪ అంగారక చలనము. శు ౧ ల॥ బ ౧౦ వరకూ పురశ్శుక్రుడును కలడు. మేఘాడంబరముకలిగి ఖండవృష్టి కలుగును. చాంద్రయోగములచే మార్చి 15,16,23,24,30,31 ఏప్రెల్ 2,12,13 తేదీలలో ఖండవృష్టి కల్గును.

---

# అర్ఘ యోగములు

చైత్రమాసము :— బ ౧౧ వరకూ ధాన్యము, నెయ్యి, ఉప్పు, బెల్లము మొ॥గువాటికి వెలలు హెచ్చుగా యుండును. బ ౧౧ నుండి గుఱ్ఱములకు, ఎనుపులకు, ధాన్యములకు ధరలు హెచ్చుగయుండును. శు ౧౩ నుండి కుంకుమాదులకు వెల హెచ్చుగ యుండును. బ ౧౧ నుండి ఎద్దులకు, పసుపు, బియ్యము, కొఱ్ఱలు, ఉల్లిపాయలు, మద్దికి, బ ౧౪ లు॥ నేయి, ముత్యములు, ఆకులు, వక్కలు, శ్రీఫలము మొదలగువాటికి ధరలు సమముగ యుండును యవ, గోధుమ ధాన్యాదులకు ధరలు సమము. చెఱకు, పాలు, రసద్రవ్యములు, నేయికి వెల సమము. ఈమాసము వస్త్రములు, చింతపండు, కూరలు, పెసలు, మినువులు, నువ్వులు, కొబ్బరి, వేరుశెనగలకు ధర సమము. లోహజాతులకు ధర సిలబాటు

వైశాఖమాసము:— శు ౮ లగాయతు నేయి. పగడములకు, శనగకు, బెల్లమునకు, నల్లఅవిశెకు ధరలు పెరుగును. బ ౧ లు॥ వడ్లు, చేపలు, బియ్యం, లవణములు, శనగకు ధర పెరుగును. శు ౧౨ లగాయతు దూది, ధాన్యములు, ముత్యములు, గోవులు, వస్త్రాదులకు ధరలధికమగును. ఈ మాసమంతయూ పశువులకూ, గుఱ్ఱములకూ, పసుపు, కూరలు, ధాన్యములు, చింతపండు, కందులకు కొంచెము ధర తక్కువగును. ఇనుము, వస్త్రములు, కంబళ్ళు, సిమ్మెంటు మొ॥గువానికి ధర పెరుగును. బ ౭ లగాయతూ చక్కెర, పిప్పలి, వక్కలు, మల్లెలకు, పట్టుధాన్యములు, ఏలకులు, జాజి, జాపత్రి, పెసలకు ధరలధికమగును. ఈ మాసమంతయు బంగారం, వెండి, గుఱ్ఱములు, ఏనుగులు, పశువులకు ధరలు సమముగానే యుండును.

జ్యేష్ఠమాసము:— శు ౭ లగాయతూ నేయి, బెల్లము, నాసిరకము ధాన్యములు, ఉప్పులకు ధరలధికము. బ ౪ లగాయతూ ఇనుము, పశువులు, ఆహారాది ధాన్యములకు, సారాయి, సాదావస్తువులకు, ధరలధికము. దూది, వస్త్రములు, చింతపండు, నువ్వులు, నూలు, అపరాలు, కొబ్బరికాయలు, మొ॥గువాటికి ధర సమముకన్న పెరుగును. శిలాజిత్తు, శ్రీగంధము, బెల్లం, మిర్చి, కర్పూరలు, చర్మములు, ఉల్లి, పొట్టు ధాన్యములకు ధర హెచ్చగును.

ఆషాఢమాసము:— బ ౩ వరకూ నేయి, బెల్లము, ఉప్పు, ధాన్యములు, ధరలు నిలుచును. బ ౪ లు॥ గోధుమలు, వరి, ధాన్యములు మొ॥గువాటి ధరలధికము. శు ౧౦ నుండి బ ౩ వరకూ గోధుమ, అపరములు, నువ్వులకు ధరలు హెచ్చును. బ ౧౦ లు॥ తేనె, ఏలకులు, చక్కెర, శొంఠాయలు, జాజికాయ వీటికి ధరలు సమముగ యుండును. పట్టు, ధాన్యములు, నెయ్యి, కందులు, పెండలము, మూలవస్తువులు, పొడివస్తువులు. వడ్లు ధర తగ్గును. ఈ మాసమంతయూ ధాన్యము, కందులు బెల్లము పసుపు వస్త్రములు, నెయ్యి, మిర్చి, ఆవాలు, చింతపండు, కొబ్బరి, కూరలు మొ॥గు వాటికి ధరలధికము,

శ్రావణమాసము :— శు ౧౪ వరకూ వరి, ధాన్యములు, గోధుమలకు ధరలు హెచ్చుగాయుండును. శు ౧౦ నుండి నూనె, గోధుమలకు ధర పెరుగును. బ ౧ నుండి ధాన్యము, ఇంగువ, పాదరసములకు, లక్క కంచుసామానులు, కర్పూరము మొ॥గువానికి ధర హెచ్చును. బ ౨ లగాయతు బంగారము,

వెండి, సర్వధాతువులు, భోజనపదార్థములకు ధరలు కొద్దిపాటి తగ్గును. బ ౩ లు॥ నూనెలు, కొబ్బరి, తేనె, మధురపదార్థములు, ఆకులు, మూలవస్తువులు, తీగెలు, వేరుశనగలకు ధర సమము, రసద్రవ్యములు ధర హెచ్చును. శనగ, రక్తచందనము, దుంపకూరలు, చింతపండు, కొబ్బరికాయలు, పశువులు మొ॥గువాటికి వియ్యమునకు ధర హెచ్చును.

భాద్రపదమాసము :— శు ౩ నుండి ౧౨ వరకు పెసర, మినువులు ధర పెరుగును శు ౧౪ నుండి బంగారము, వెండ, సర్వధాతువులు, మణులకు ధర సమము. ఈ మాసమంతయు దూది, గోధుమ, నువ్వులు, కూరలు, పెసలు, మినుగులు. ధరలు హెచ్చును. శ్రీగంధము, ధనియాలు, ధాన్యము, వెండి, బంగారము, పంచదార, పగడములు ధర పెరుగును

(పంసర్ప) అధిక అశ్వయుజమాసము :— శు ౧౪ నుండి కొబ్బరి, మూలజాతివస్తువులు, ధాతువస్తువులు, సర్వఓషధులు, దేవదారులకు ధర హెచ్చు. బ ౫ లు॥ మినువులు, పెసల, శనగలు, ధర హెచ్చును. బ ౧ వరకూ పశువులకు ధర హెచ్చును. బ ౯ లగాయతూ బంగారము, వెండి, నెయ్యి, నార, ఆకులు, సజ్జలు, నూనె, ఇంగువ మొ॥గువస్తువులు ధరలు పెరుగును. మాసమంతయూ పసుపు, కుంకుమ, కూరలు, కొంచెము ధర తగ్గును. నూనెసరకులు, పెసలు, మినువులు, కుంకుళ్ళు ఇనుము, వస్త్రములు, కంబళ్ళు ధర పెరుగును. కర్పూరము, కుంకుమపువ్వు, పిప్పళ్ళు, రాగి, ఇత్తడి, కంచు, కస్తూరి, పాదరసము, మిరియాలు, ధనియాలు ధరలు పెరుగును

నిజ ఆశ్వయుజమాసము :— శు ౬ నుండి పొట్టుధాన్యములకు, శు ౧౧ లగాయతూ నూనెలు, కొబ్బరి, తేనె, మూలవస్తువులు, తీగవస్తువులు, వేరుశనగలకు ధరలు అదికమగును. బహుళయందు మందువస్తువులు, బాణాసంచాలకు వర్షములవల్ల ధరలు పడిపోవును ఇంకనూ ఈ మాసమంతయూ నిత్యావసరవస్తువులు, అగరవత్తులు, కర్పూరాదులకు ధరలు సమము. పశువులు ధర పెరుగును. కంచు, శిలాజిత్తు, తగరము, ఇత్తడి, అభ్రకము, వెండి, బంగారము, ధాన్యములు ధరలు పెరుగును. మిగిలినవాటికి ధర సమముగనే యుండును.

కార్తీకమాసము :— శు ౧౧ నుండి వరి, వులవలు, నువ్వులు, నూనె, నేయి, ధాన్యములకు ధరలు పెరుగును. శు ౧౨ నుండి చెఱకు, వరి, నేయి, పశువులు, బంగారము, వెండి, కొబ్బరికాయలు, పండ్లు ధర లధికమగును. శుద్ధ ౯ లగాయతూ తెల్లవస్త్రములు, ఉప్పు, దూది, మారేడు, పొట్టుధాన్యములు, వక్కలు, ఏలకులు, జాజిఫలము, గోవులు, పెసలు, నువ్వులు ధర పెరుగును. బ ౧౫ లగాయతూ బంగారము, వెండి, గుడ్డములు, స్ఫటిక, లక్క, వస్త్రములు, భోజన పదార్థములు ధర లధికమగును చందనము, కర్పూరము, అగరు, సైంధవలవణములు, తుత్తునాగము, పెట్రోలు, తైలద్రవ్యములు ధర లధికము.

మార్గశిరమాసము :— బ ౧ నుండి ధాన్యములు, బెల్లము, చక్కెరధరలు సమము. జీడిలు, ఖర్జూరము రేట్లధికమవ్వవు. శుద్ధ ౧౫ నుండి తైలములకు, ఉప్పు, రసద్రవ్యములకు, కస్తూరి సుగంధద్రవ్యములు ధరలుసమము. శుద్ధ ౧౩ కి వడ్లు, యవధాన్యములు, అశ్వములు, వజ్రములు, ధాతుపదార్థములు వెల లధికము. బ ౧౧ లు॥ వడ్లు, ధాన్యములు, గోధుమ, పెసలు, చందనము, చిరు

శనగలు, ఆహారపదార్థములు ధర పెరుగును, ఈ మాసమంతయు ధాన్యము, పసుపు, వస్త్రములు, నువ్వులు, బెల్లము, కొబ్బరి, వేరుశనగ, చింతపండు ధర అధికమగును. దుంపకూరలు, రక్త చందనము, నూనెలు, పండ్లు, బెల్లము, పంచదార, కాఫీ, ఇత్తడి ధరలు హెచ్చుగా నుండును.

(పుష్యము + మాఘము) మాసము :— ఐ ౨ నుండి నూనె, నెయ్యి, పగడములు, శనగలకూ, బెల్లమునకూ, నల్ల అవిశెకు ధర అధికమగును. ఐ ౬ నుండి పుష్పములు, వస్త్రములకూ, నూలుకు, దూదికి, పోకలకూ వెలలు పెరుగును. ఖ ౬ నుండి ధాన్యాదులకు వెలలు మించును. ఈ మాస మంతయు నెయ్యి, జాజి, జాపత్రి, ఇత్తడి, రాగి, సిల్వర్, ఖర్జూరము, తృణజాతులు, ఉప్పు మొదలగువాటికి ధర పెరుగును. మిగిలిన వస్తువులు ధరలు సమముగ యుండును.

అధిక ఫాల్గుణమాసము :— ఖ ౪ లగాయతూ బెల్లము, ధాన్యములు, శనగలకు ధరలు హెచ్చును. ఐ ౪ నుండి వక్కలు, మిరియాలు, ఆవాలు, నూనె చందనము, ఇంగిలీకములు ధర అధికమగును. ఐ ౩ లగాయతూ శ్రీచందనము, కస్తూరి, దేవదారు, అగరు, కర్పూరము, రక్తచందనము, కంద ధరలు సమము. ఖద్ధర వరకూ నువ్వులు, వస్త్రములు, నూలు, పోకలు హెచ్చు ధరలగును. ఖ ౧౪ నుంచి గోవులు ధర హెచ్చును. ఈ మాసము ధాన్యము, కందులు, మినుములు, ఉల్లి పాయలు, మిర్చి, పసుపు, నీలాలు, సీరాలు, ధర అధికం. ఇంగువ తెల్లని వస్తువులు, పుష్ప జాతులు, లోహజాతులు, రత్నాదులు, నిత్యావసరవస్తువులు ధరలు అధికమగును.

నిజ ఫాల్గుణమాసము :— ఖ ౧౪ నుండి పొట్టుధాన్యములకు వెల ఎక్కువ. ఖ ౧౫ నుండి కుంకుమాదులు ధర హెచ్చును. డాక్టర్లకు డిమాండ్ పెరుగును. ఐ ౧ నుండి చందనము, కస్తూరి, కర్పూరము, దేవదారు, కందలకు, పచ్చిమిర్చికి ధరలుతగ్గును. భూములు రేట్లు పెరుగును. కందులు, పసుపు వస్త్రములు, నెయ్యి, మిర్చి, వెంకాయలు, కూరలు ధర అధికమగును. ఈ మాసమంతయునూ పెరుగు, క్షీరములు, వేరుశనగ, పీతాంబరము, జొన్న, సువాసనద్రవ్యములు, ఆవాలు, జీలకర్ర ధనియాలు, కలపవస్తువులు, ఇనుము, లోహములు వెల అధికముగనే యుండును. మిగిలిన వాటికి ధరలు సమముగనే యుండగలవు.

---

## శ్రీ దుందుభినామ సంవత్సర గోచారఫలములు

### మేషరాశి

(అశ్వి, భర, కృత్తిక 1 పా॥)

ఆదాయము : 2; వ్యయం : 8 రాజ పూ : 1; అవ : 7

ఈ రాశివారికి నవం 25 వరకు గురుడు 7 ట తామ్రమూర్తి, తదాది 8 ట లోహమూర్తి, శని అక్టో 5 వరకు 6 ట తామ్రమూర్తి, తదాది 7ట సువర్ణమూర్తి. ఈ సం॥రము రాహువు 3ట కేతువు 9ట లోహమూర్తి గురుడు నవం 25 వరకూ శుభుడు, శని సం॥రం అర్ధ శుభుడు, ఈ సం॥రం రాహు

కేతువులు శుభ ఫలితము లిత్తురు. అక్టోబరు వరకు ప్రతీపనియందూ ఎక్కువ అనుకూలముగ యుండును. తదాది డిశంబరు వరకు సామాన్య ఫలితమును. ధనవ్యయమునుకల్గియుండును. రాహుకేతువులు శుభులయి నందున కొంతవరకూ అనుకూలవంతులు. వీరులగ్నాత్ తృతీయమందు నవమందుయుండుటవలన పరాక్ర మవంతులగుదురు. దైవబలము వలననే పనులు సాగించుకోగల్గుదురు. ప్రయాణములకు వృధావ్యయము కాక తప్పదు. ప్రతీపనీ మాటనేర్పుతో పరిష్కరించుకోగల్గుదురు. కుటుంబ, ఆరోగ్య, స్వకీయమందు జాగ్రత్త కలిగియుండవలెను. 3, 4, 6, 9. నెలలయందు కొంత అనుకూలము. నిదానమువలన భూగృహ మార్పులు, లావాదేవీలు విజయవంతమగును. ఉద్యోగులకు అక్టోబరు వరకు యోగకాలము. వైద్య, రసా యనిక, యంత్ర, జ్యోతిష, రెవిన్యూ ఉద్యోగులకు అనుకూలత కలదు. విద్యార్థులకు ఫలితములనుకూల మగును. రక్తచర్మ, ఉష్ణవ్యాధులకు ఔషధ సేవచేయవలెను. శత్రువిజయము, ధైర్యము, విముక్తి మాట చలాయింపు, అధికార యోగము కల్గును.

పుష్యరాగము, నీలము ధరించుటవలననూ. శని, గురు స్తోత్రములు వలనను, సుబ్రహ్మణ్య పూజలు చేయుట వలననూ విశేషయోగదాయకమూ 6, 8, 9, 17, 28, తేదీలు, ఆది॥ సోమ, గురు వారములు యోగించును.

## వృ ష భ రా శి

(కృత్తిక 2,3,4 పా॥ రోహిణి, మృగ 1,2 పా॥)

ఆదాయము : 11; వ్యయం: 14 రాజ పూ: 4; అవ: 7

వీరికి నవం 25 వరకు గురుడు 6 ట సువర్ణమూర్తి, తదాది 2 ట సువర్ణమూర్తి, అక్టో 5 వరకు, శని 5 ట రజితమూర్తి, తదాది 6 ట లోహమూర్తి సం॥రం రాహువు 2 ట కేతువు 8 ట తామ్రమూర్తీ, నవంబరు నుండి గురుడు అక్టోబరు నుండి శని అనుకూలురు. రాహు కేతువులు సామాన్యులు. అక్టోబరు లగాయతూ ఎక్కువ యోగకాలముగానుండును. సంవత్సరాంతము వరకూ సామాన్యము. ప్రతీవారినినమ్ముట యుక్తముకాదు. రాహు కేతువులు సామాన్యులయినను గురు శనుల బలముచే ప్రతి పనియు విఘ్నముగా యున్ననూ ముందుకుసాగును. ఆదాయము అనుకూలముగా యుండును. వ్యవసాయదారులకు. వ్యాపారస్తు లకు ధైర్యముగా నడచుకొనిన మేలుకలదు. పలానవస్తువులు, యంత్ర, విద్యుత్, లలితకళలు కిరాణవర్తక వృత్తుల వారికి అనుకూలకాలము 4, 5, 9, 10. నెలలయందు యత్న కార్యసిద్ధి, గౌరవ సన్మానములు పొంద గల్గుదురు. భూగృహాది మార్పులు అనుకూలించును. నూతనవ్యాపారమునందును పుష్పజాతుల వ్యాపారములు అనుకూలించును. దైవబలమువలన విశేషము కలదు. విద్యార్థులు ఎక్కువ కృషి వలననే ఉత్తీర్ణులగుట జరుగును.

గోమేధికము ధరించుట వలననూ, రాహుకేతువులకుజపము స్తోత్రములు. సుబ్రహ్మణ్య పూజలు చేయుటవలనను ఎక్కువశుభ ఫలితము కలదు. 4, 6, 10, 15. 23, తేదీలు మంగళ, శుక్ర, శనివారములు యోగములు.

## మిథునరాశి

(మృగ 3,4, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా॥)

ఆదాయం: 14; వ్యయం: 11 రాజ పూ: 7; అవ: 7

వీరికి నవంబరు 25 వరకు గురుడు 5 ట రజతమూర్తి. తదాది 6 ట తామ్రమూర్తి. శని అక్టోబరు 5 వరకు 4 ట లోహమూర్తి. తదాది 5 ట సువర్ణమూర్తి. రాహు కేతువు సంవత్సరము జన్మమందు సువర్ణ మూర్తి కేతువు 7 ట సువర్ణమూర్తి. నవంబరు 25 వ గురుడు శుభుడు. శని అక్టోబరు లగాయతూ శుభుడు రాహు కేతువులు సువర్ణమూర్తులయినందున అర్ధశుభులు, వీరికి అక్టోబరు నుండి ప్రతిపనియందును అను కూలమయినకాలము. వీరు ధనమునకన్న గౌరవము ప్రధానముగా తలంచెదరు. ఖర్చులకు తగిన ఆదా యము కల్గును. తలవని తలంపుగా ఖర్చులు ఎదురగుచుండును. కోర్టువ్యవహారములయందును, రాజ కీయములందును 3 వంతులు జయముకల్గును. ఉద్యోగస్థులు ఫలితములు నిదానముపై అనుకూలమునకు తగు ఓర్పు అవసరము. నూనె, చింతపండు, పేపరు, యంత్రముల మొదలగు వ్యాపారస్థులకు సామా న్యము, కర్షకులకు అనుకూలము. కోర్టువ్యవహారములకు అనుకూలము. సామాన్యముగా తలపెట్టిన పనులు సులువుగా నెరవేరినటు కనబడిననూ కార్యవిలంబము, వ్యయము కనబడును. ఓర్పు చాకచక్యము అవసరము. సినీమా, న్యాయ, వైద్య, రాజకీయ, మంత్రవృత్తులు వారికి 6, 10, 11, 12, నెలలు సామాన్యము.

భూ గృహమార్పులు అనుకూలముకాదు. ఆకస్మిక ధనలాభము, రానిబాకీలు వసూలు అగుట జరుగును. ప్రయాణములందు జాగ్రత్తమంచిది. పైత్య, శ్లేష్మ సంబంధమయిన అనారోగ్యమువలన ధన వ్యయము కల్గును. యాక్టర్లుకు, డాక్టర్లకూ, ప్లీడర్లకూ అక్టోబరునుండి అనుకూలము. కళత్ర అనారోగ్యము సూచనలు కల్గిననూ నివారింపబడును. ప్రతిపనియందు, శ్రమ, త్రిప్పట, ఆలసట, మానసిక శ్రమకల్గి ననూ అనుకూలము. 1,5,6,9 తేదీలు, సోమ, బుధ, గురువారములతో కలసివచ్చిన యోగప్రదములు. గోమేధికము ధరించుటవలననూ, రాహు కేతువులకు జపముచేయించుకొనుట వలననూ, సుబ్రహ్మణ్య పూజలు చేయుటవలనను, విశేషయోగదాయకముగా యుండును.

## కర్కాటకరాశి

(పున 4, పుష్యమి, ఆశ్రేష)

ఆదాయం: 8; వ్యయం: 11 రాజ పూ: 3; అవ: 3

వీరికి ఈ సంవత్సరం నవంబరు 25 వ గురుడు 4 ట లోహమూర్తి. తదాది 5 ట రజితమూర్తి అక్టోబరు 5 వరకు శని 3 ట తామ్రమూర్తి. తదాది 4 ట తామ్రమూర్తి. సంవత్సరం 12 ట కేతువు 6 ట రజితమూర్తి. నవంబరు 25 నుండి గురుడు శుభుడు, అక్టోబరువరకు శని శుభుడు. సంవత్సరం రాహువు సామాన్యుడు, కేతువు శుభుడు ఈ సంవత్సరం శుభా శుభ మిశ్రితముగానుండును. ప్రతిపనియందును

ఆలస్యము సూచించుచున్ననూ అనుకూలించును. తరచుఋణము చేయవలసివచ్చినను తీర్చగలరు. శక్తికిమించిన పనులు చేయవలసివచ్చును. రాజకీయములకు కోర్టు వ్యవహారములకు సంవత్సర ఆరంభమున ఎక్కువ అనుకూలము. 2,11,12 నెలలయందు జాగ్రత్తఅవసరము. అనారోగ్యసూచనలు కల్గుచున్నను నెమ్మదిగా నివారణఅగును. మిర్చి, పుగాకు, పేపరు, కర్మాగార, కంట్రాక్టు, వస్త్ర వ్యాపారస్తులకు కొంతమేలు కనబడును. ముందుజాగ్రత్తకల్గి వ్యవహరించుటమంచిది. విద్యార్థులకు మొదటి పరీక్షాఫలితములు ఎక్కువ అనుకూలము. ఉద్యోగస్థులకు అక్టోబరువరకు ఎక్కువ అనుకూలము. తదాది సామాన్యము, సంవత్సరాంతమున శుభకార్యార్థములు కలసివచ్చును. భూ గృహమార్పులు అనుకూలములు కాగలవు. డాక్టర్లు, ప్లీడర్లు మొదలగు వారికి సంవత్సరారంభము ఎక్కువ అనుకూలకాలము. ఆదాయమునకు మించినఖర్చులు కనబడుచుండును. 3, 7, 12 నెలలందు అనారోగ్యసూచనలు, ఔషధసేవయు కలుగును. సంవత్సరాంతమునకు యత్నకార్యసిద్ధి చేకూరును. 1,2,6,8 తేదీలు సోమ, గురు, శుక్రవారములు యోగించును. ఇంద్రనీలము ధరించుటవలనను, శని జపము, అభిషేకములు, దుర్గపూజలు జరుపుట వలన విశేష శుభ ఫలితముల నొందగలరు.

## సింహరాశి

(మఘ, పుబ్బ, ఉత్తర 1 పా॥)

ఆదాయం: 11; వ్యయం: 5 రాజ పూ: 6; అవ: 3

ఈ రాశివారలకు నవంబరు 25 వరకు గురుడు 3 ట తామ్రమూర్తి. తదాది 4 ట లోహమూర్తి. సంవత్సరం అక్టోబరు 5 వరకు శని 2 ట సువర్ణమూర్తి. తదాది 3 ట రజితమూర్తి. రాహువు 11 ట కేతువు 5 ట లోహమూర్తి. సంవత్సరమంతయు రాహువు, కేతువులు శుభులు. నవంబరు వరకు గురుడు శుభుడు. మొత్తముమీద ఈ సంవత్సరమంతయు వీరికి యోగకాలముగా నడచును. చాలకాలమునుంచి స్తంభించియున్న పనులన్నియు నెరవేరును. అక్టోబరు 5 నుండి ప్రతిపనియందును అనుకూలము, యత్నకార్యసిద్ధి కల్గును. సంవత్సరాంతమునకు శుభకార్యములు నెరవేరును. కోర్టు, రాజకీయ, వ్యాపారములు అనుకూలముగ యుండును. భూ గృహాది మార్పులు నిలచియుండును. మధ్యమధ్య కొంత అస్థిమితముగ చికాకులు కల్గిననూ మనశ్శాంతి, కుటుంబసౌఖ్యము కలుగును. విద్యావ్యాసంగములు, తీర్థయాత్రాదులు అనుకూలము. శాంతస్వభావము ఆరోగ్యము కల్గియుందురు. ఉద్యోగస్థులకు ఎక్కువ యోగకాలము, ప్రమోషనులు లభించును. అభీష్టస్థానము పొందగలరు. బొగ్గు, కలప, ఇనుము వస్త్రములు మొదలగువానివలన అధిక లాభములు పొందగలరు. విలాస వినోదములకు వ్యయము తప్పదు. వ్యాపార, వ్యవసాయస్థులకు అధిక లాభములు. 1,2,7 తప్ప మిగిలిన నెలలు అనుకూలములు. విద్యార్థులు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులగుదురు. ఉపాధ్యాయ, పాండిత్య, వైద్య వృత్తులవారికి అనుకూలకాలము. 1,3,5,9 తేదీలు ఆది, గురు, శుక్రవారములు యోగప్రదములు. పుష్యరాగము వలన, గురు జపము వలన, శివస్తోత్రముచేయుట వలనను మంచి ఫలితములు కనబడును.

